సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 15 డిశంబరు '72 సంచిక 11

విషయానుక్రమణిక

—: చిత్రము: —

ఓం శ్రీ పురుషోత్తమాయనమః


| | | |
|---|---|---|
| రామకథా రస వాహిని (35): | భగవాన్ శ్రీసత్య సాయి బాబా | 409 |
| అద్వితీయ బ్రహ్మము | రామశర్మ | 418 |
| జన్మదినోత్సవము | (శ్రీవారిదివ్యోపన్యాసము) | 424 |
| తెరవమని వారేతట్టుదురు | | 429 |
| సబ్‌కో సన్మతి | (శ్రీవారిదివ్యబోధ) | 433 |
| పిల్లలు .. పెద్దలు | (శ్రీవారిదివ్యబోధనుంచి) | 438 |
| శిక్షా పోషణ | (వినాయక) | 443 |
| | పుస్తక సూచి: | 445 |


—: శ్రీ వారి కార్యక్రమములు: —

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు ఎడిటర్, సనాతన సారథి, ప్రశాంతినిలయము పోష్టు, పెనుకొండతాలూకా అనంతపురం జిల్లా, అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయిపెయిడ్ టెలిగ్రాంగాని పంపితే కొత్తచెఱువు కి॥ PCO ఫోన్‌చేసితే తెలుపగలము

## చందాదారులకు విజ్ఞప్తి

TC 8169 నుండి TC 8720 వరకు

మీ రశీదు కార్డుల్లోను ఈ పత్రికలోని మీ విలాసపు కాగితములోనూ మీ చందా గడువు ఏ సం॥ ఏ నెలవరకు, అని తెలుపే నంబర్లున్నవి, గమనించండి. ఫెబ్రవరి 73 సంచిక నుండి మీరు క్రొత్త చందాలు కట్టవలసి యున్నచో (ఇదివరకు పంపనియెడల) జనవరి 15 తేదీలోపల, (సం॥ రూ 4) కార్యాలయము చేరునట్లు పంపవలయును.



# రామ కథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

**35**

## లక్ష్మణుని కంటిధారలు

ఇంతలో లక్ష్మణుడు కంఠెత్తిచేసుకొని వళ్ళుమరచి పెదవులువణకుచు నోటిమాటాడక కనురెప్పలువాల్చక భూమినిచూచుచూ వదలుచున్న కంటిధారలను రామచంద్రుడు చూచినాడు. ఇట్టిస్థితిలోనున్న లక్ష్మణుని వదలి వెళ్లుట మంచిదికాదని యోచించినాడు.

అంతేకాక తానువెళ్లినతరువాత లక్ష్మణుడు విచారములో యేమైననూ చేసుకోగలడు, యేమైననుచేయగలడు అట్టిచర్యలు తనవలననే జరిగినవికాగలవుకాన లక్ష్మణుని శాంతపరచుట మంచిదని తలంచి రాముడు లక్ష్మణు

నితో, తమ్ముడా! కోపము సర్వపాపములకూ ధూపము. దానిని నిగ్రహించుకో. రామచంద్రునకు ఇంత అవమానము జరిగెనే అనినీవు దుఃఖపడవద్దు. సత్యధర్మములకు మానాభిమానములుండవు, ధైర్యమువహించు. తండ్రిని సేవించి ధన్యుడవుగమ్ము అని ఆశీర్వదించగా

లక్ష్మణుడు, అన్నా! నాప్రాణసమానుడైన రాముడు అరణ్యమునకు వెళ్లుచుండ జడమైన ఈ కాయముతో యెవరిని సేవించగలడు ఈలక్ష్మణుడు? లక్ష్మణునకు రామసేవతప్ప అన్యసేవలు అక్కరలేదు. నీధర్మములు నికెటులో నాధర్మములూ నాకట్టివే కాన నేను తమవెంట వత్తును. నాకు యెవరి ఆజ్ఞయూ అక్కరలేదు నేను కైకేయీ కోరినవరములలో చేరలేదు; వకవేళచేరిననూ నేను ఆమెఆజ్ఞనుకానీ లేక ఆమె అనుచరుల ఆజ్ఞనుకానీ ఆలకించను; నన్ను ఆజ్ఞాపించుటకు వక్కరామునకు తప్పయెవరికీ అధికారములేదు. కాన ఇదుగో ఇప్పుడే నేను కూడా జటావల్కలములుధరించి సిద్ధమగుదును అని పట్టాభిషేకమునకై చేసుకొన్న అలంకారమును అభరణములనుతీసి క్రిందపారవేసి కుండలములు చంద్రహారములూ నలుదిశలా పారవేసెను. అన్నతో వెళ్ళుటకు సిద్ధమాయెను.

లక్ష్మణుని త్యాగమును చూచుచున్నరామునికి హృదయముకరిగినది. దగ్గరవచ్చి వీపునిమురుతూ, తమ్ముడా! ఇట్టితమ్ముడు నాకుండుట నాఆనందమునకు అంతు

లేదు; ఇదినాభాగ్యము నీవునాతోవచ్చుటచే తల్లియైన కౌసల్యకూడనూ కొంతశాంతించగలదు. నేను ఈ పదునా లుగు సంవత్సరములూ అరణ్యములందు యేరీతిగా జీవితమును గడుపుదునో కడకు పదునాలుగుసంవత్సర ములూ పూర్తిగడుపుకొని అయోధ్యకు రాగలడో లేడో అన్నభయము అనుమానము తల్లిలో కలతపెట్టుచున్నది కాన నీవు తల్లికితగినరీతిగా ధైర్యము చెప్పుము

మనము ఈరీతిగా కాలముగడుపుచుండిన తండ్రి మరింత బాధపడును; ఇంకనూ బయలుదేరలేదు; కడకు రాముడు అరణ్యమునకు వెళ్ళునో వెళ్ళడో అను అనుమా నము కైకలో చెలరేగవచ్చును; కాన నేనుసీతతో ఈవా ర్తనుతెలిపి కైకేయీమందిరమునకు వెళ్ళి తండ్రికి నమ స్కరించి వెళ్లులోపల, నీవు మీతల్లియైన సుమిత్ర అను మతిని బడసిరమ్ము, అని కౌసల్యకుప్రదక్షిణచేసి నమ స్కరించుచుండ అంతఃపురములోని దాసీలు మిగిలిన రాణులు వక్కతూరి ప్రళయము వచ్చినటుల గొల్లున

### తల్లి ఆశీర్వచనములు

తల్లీ! ఆశీర్వదించమని శిరస్సువంచి నిలుచున్న కొ మరుని అక్కునచేర్చి శిరస్సునుముద్దాడి నాయనా రామా, నీవు పరమధార్మికుడవు. పరాక్రమవంతుడవు; నీకుఅర ణ్యములందుండు యెట్టిభయమునూ వుండదు; వనవాసము చేయనిశ్చయించుకొంటివి. నిన్ను నివారించుట నాచేత

కానిపని అయినది. నీకు శుభము. నీవు పితృవాక్యపరిపా లనముచేసి పితృఋణముతీర్చి చరితార్థుడవుఅయి నీవు తిరిగివస్తే అంతేచాలును; నేను ఆనాడె సంతోషింతును రామా! దైవబలము సామాన్యముకాదు దైవనిర్ణయమును యెట్టివారునూ మార్చలేరు యేధర్మమునకై నీవు అడవికి వెళ్ళుచున్నావో అధర్మమేనిన్ను రక్షించును.

"రామా! పదునాలుగు సంవత్సరములు గడచిన తరువాత జటావల్కలధారివై నీవుఇప్పుడే కనుపించిన యెంతబాగుండెడిది, అయ్యో నా పిచ్చి. పదునాలుగు సం వత్సరమన్న సామాన్యమా? నాయనా! యేమని ఆశీర్వదిం తును పదునాలుగుసంవత్సరములూ పదునాలుగుదినము ములుగా! కాదుకాదు! పదునాలుగు నిమిషములుగా గడిపి రమ్ము. రాజ్యాభిషిక్తుడవు కమ్ము. ఏ రఘువంశోద్ధారకా! యినకులతిలకా! నాముద్దుబిడ్డా! యేధర్మరక్షణకై నీవు అడవులకు వెళ్ళుచున్నావో ఆధర్మదేవతనే నీచుట్టూవుండి రక్షించును. అంతకంటే రక్షకులు మరొకరులేరు.

నీకొరకై నేను ఈపదునాలుగు సంవత్సరములూ హోమములు చేయుచుందును. నీపితృసేవ మాతృసేవ గురుసేవలే నీకు 'ఆయురారోగ్యములందించును; నీసత్యవ్రతమే పరమధైర్యము నందించును. పర్వతములు నదులు పొదలు పుట్టలూ పిట్టలూ నీఅండనచేరి ఆదరించి ఆనందమునందించును. సూర్యచంద్రాదులు నక్షత్రాది

ఉపగ్రహములు సహితము నిన్నే ఇక్కట్లుకు గురికాక కాపాడును. క్రూరకృత్యాలకు వడిగట్టే రాక్షసులుసహితము నీచల్లనిప్రేమకు వశమై నీకు దాసోహం కాగలరు. అని ఆశీర్వదించుచూ

పొరలివచ్చే దుఃఖమనుదిగమ్రింగుతూ సంతోషము నభినయిస్తూ రాముని తలనువంచి ఆఘ్రాణించింది. అతనినిగట్టిగా కౌగిలించుకొని చెకునముద్దుపెట్టుకొన్నది. అదురుచున్న పెదవులతో, రామా! క్షేమంగా తిరిగిరమ్మా ఆనందముగాపొమ్మా, అనిపలికింది. రాముడుకూడనూ తల్లిప్రేమను బాగాఅర్ధము చేసుకొన్నవాడు కనుక ఆమెను బాధపెట్టుటకుకూడా తానువప్పుకొనక తప్పనదికానందున పదేపదే తల్లిపాదములకు నమస్కరించుచు

అమ్మా! నీవు దుఃఖించక, నిద్రాహారములుమానక ఆరోగ్యమును పాడుచేసుకొనక, నిరంతరము చల్లనిహృదయముతో నన్ను తలంచుచుండు; నీతలంపుఘెట్టిదిగా వుండునో నాక్షేమము అట్టిదిగావుండును; కాన నాక్షేమము సుక్షేమంగా సుఖవంతంగా వుండాలన్న నీవు దుఃఖించక ఆశీర్వదించుచుండుము. అనిప్రార్ధించి విడువలేక విడువలేక తల్లియైన కౌసల్యను వదలి జనావృతమైన రాజవీధిలో రాముడు పాదచారుడయి నడువసాగినాడు.

అగుపడంతునిచూచి జనసమూహము కంపించిపోయింది. గాలివార్తగావచ్చిన రామ అరణ్యవాసము నిజమై

నవో కాదో అన్న ఆందోళనలోవున్న పురజనులు రాముడు పాదచారుడై రావటములో కృంగిపోయినారు; పట్టాభిషేక మని పొంగిన పొంగులన్నియూ కృంగి ప్రవహించినాయి జీవచ్ఛవములవలే వారిముఖములు వాడినవి.

సీతాదేవి అంతఃపురము

రాముడు తలయెత్తిచూడక యెవరితోనూ మాటాడక సీతాంతఃపురమునకు వెళ్ళుచున్నాడు కైకేయీమందిర మున యేమిజరిగినదో తెలియని సీతాదేవి పట్టాభిషేకగడి యలుసమీపించుచున్నవే యింకా రాముడు యెందుకు రాలేదని ద్వారములుచూచుచుండెను. ఉపవాసవ్రతములు పూర్తిచేసి, గంధపుష్పాక్షతాదులు చేతపట్టుకొని రాముడు యెప్పుడెప్పుడువచ్చునా అని ఉవ్విళ్లూరుచున్నది. ఆమె తో పాటు అంతఃపురములోవున్న అందరూ సంతోషముతో ఓలలాడుచుండిరి. మంగళాంగనలు. హారతులు సిద్ధము చేసికొనియున్నారు. ఇంతలో అపూర్వముగా అలంకరించి యుండిన ఆ అంతఃపురములోనికి రాముడు తలవంచుకొని వచ్చుటచూచి దిగ్భ్రాంతిచెందిరి. ఇంతలోసీతాదేవి యెదు రేగి చూడ ఆమెను ఆమే నమ్మ లేకపోయినది.

దేహము గజగజవణకినది, పెదవులు అదరుచూ ప్రభూ! యేమిటిది? ఇట్లావున్నావెందులకు? ఈనాడు బృహస్పతిదేవతాంకితమయిన దినమని చెప్పిరికదా. శుభ కరమైన దినము అని పుష్యమీ నక్షత్రములో మీ యువరా

జ్యాభిషేకమని బ్రాహ్మణోత్తములు చెప్పిరికదా? మీ దివ్యసుందర విగ్రహమునకు జలఘననిభము, శతశలాకాయుతము అయిన శ్వేతచ్ఛత్రము యెందుకుపట్టలేదు? చంద్రమండలమువలే తళ తళ లాడుతూ హంసలవలే తోచే వింజామరలు మీకు యెందుకు వీచరైరి?

వందిజనులు స్తోత్రపాఠాలు పలుకలేదెందులకు? నాథా! వేదపారంగతులైన బ్రాహ్మణులు మూర్ధాభిషిక్తులు అయిన మీ శిరమున తేనె పెరుగూ పెట్టి అభిషేకము చేయులే దెందులకు? మంత్రులు, సామంతులు, శ్రేణిముఖ్యులు మీవెంటనడచిరాలేదే? నీలమేఘము నేలమీద నడచుచున్నదో, కాక, నల్లటికొండ కదలిపోతున్నదో, అన్నట్లు కనుపించే శత్రుంజయము అను మదపుటేనుగు మీముందు నడచి రాలేదెందుకు?"

అని సీతాదేవి ప్రశ్నలవర్షము కురుపించుచుండుటచే రాములు యేమిచేయుటకూ తోచక, అంతసులభంగా చెప్పునట్టి విషయము కానందున లోనికి వెళ్లి సీతను దగ్గర చేర్చుకొని, సీతా! పూజ్యపాదులు మానాన్నగారు నన్ను ఇదేముహూర్తములో అరణ్యమునకు పంపుటకు నిశ్చయించుకొన్నారు కాన ఇప్పుడే పితృఆజ్ఞ పరిపాలనగావించవలసివున్నది. సీతకు ఈ మాటలు నమ్మరానివైతోచినది. కారణముచెప్పక విషయమునుమాత్రమేచెప్పుటచే సీతాదేవి

నాథా! అరణ్యములకు పంపునట్టి అపరాధము తామేమిచేసితిరి. ధర్మాత్ముడైన దశరథుడు నిష్కారణముగా అట్టిఆజ్ఞను విధించడు కదా? తాము ను అట్టి అపరాధములుచేయరుకదా? అట్టితరు మీరు వనవాసముచేయుటలోని అంతరార్థమేమిటి?

అని ప్రశ్నించగా రాముడు చిరునవ్వుతో సీతా! పూర్వము పకప్పుడు నా తల్లియైనకైకేయిదేవికి మా నాయనగారు రెండువరముల నిచ్చెనట. అవి ఆయన ఇంతవరకూ చెల్లించలేదు. ఈమెనూ కోరలేదు, నేడు ఆమె ఆ రెండు వరములు కోరుటలో వకటి; భరతునకు పట్టాభిషేకము చేయవలెననియూ రెండవది; నన్ను జటావల్కలములు ధరించి పదునాలుగుసంవత్సరములు వనవాసముచేయవలెననియూ కోరినది. మాతండ్రి పరమధార్మికుడు; అడిన మాట తప్పనివాడు; అందువలన తలవొగ్గినాడు. కాన నిన్ను చూచి వెళ్లవలెనని ఇప్పుడిక్కడివస్తిని అని అన్నాడు.

రామచంద్రుని హితబోధలు

సీతా! నీవు మహాపూజ్యమైన వంశమునందు జన్మించతివి. నీవు సమస్తధర్మములూ తెలిసినదానవు. పరమధర్మవేత్త జ్ఞాని అయిన జనకమహారాజు మీతండ్రి. ధర్మచారిణివి. నేను ఈనాడే అడవులకు వెళ్ళవలసి వున్నది. పరంపరా గతమైన ఈ రాజ్యాన్ని దశరథమహారాజు భర

తునికి యిచ్చివేసెను; ఇక ఈ దేశానికి భరతుడు ప్రభువు. పట్టాభిషేకము అయిన వెంటనే అతడు నీకు నమస్కరించుకొనుటకై వచ్చును. నీవు నా తమ్మునెదుట నన్ను గురించి శ్లాఘించుట లేక నన్ను యిట్లు అరణ్యమునకు పంపెనను దుఃఖముతో అతనిని తూలనాడుట జరుగకూడదు.

రాజులు తమను ఆరాధించి. సేవించువారలనే మెచ్చుకొందురు కనుక నీవునన్నువర్ణించుటకానీ అతనిని తిరస్కరించుటకానీ చేయకూడదు; దేహరీతిగా నాకు తమ్ముడు నీకుమరది; అయితే స్థానరీతిగా నీకూ - నాకూ ప్రభువే భరతుడు అట్టిప్రభువుకుతగిన గౌరవమునునీవు అందించు; భరతునకు అప్రియమయ్యే అటుల మెలగవద్దు.

ఓ కల్యాణి! నీవు భరతునికేకాక వృద్ధుడైన దశరథుణ్ణి అతని ఆజ్ఞను శిరసావహించి నడచుకో. నా వియోగములో కుమిలిపోవుచున్న తల్లి కౌసల్యకు తగినరీతిగా సేవలుసలిపి ఆమెను దుఃఖమునుండీ వేరుచేయుటకు తగినటులచూచుకో.

మిగిలిన ఇరువురుతల్లులూ అనగా కైకేయి సుమిత్రలు నన్ను పక్కమాదిరిగాచూచిరి, కనుక, వారి ఆజ్ఞలను కూడా నీవు జవదాటవద్దు. భరత శత్రుఘ్నులు నాప్రాణసమానులు; వారలనిరువురినీ నీతొబుట్టువులవలే లేదా పుత్రులవలే ఆదరించు.

సంఘజలధిఁ జిలికి శాశ్వామృతంబిడ
ధరణిరక్షయునెడి గిరిని వాల్చి
సత్యసాయియనఁ గఁ బ్రత్యక్షముగ నున్న
యాదికూర్మ విష్ణు నభినుతింతు॥

కడలిఁబడినపుడమిఁగడకొమ్మునను యెత్తి
కాఁచు నాదికిటియె కలిని నేఁడు
యుద్ధవార్ధిమగ్న నుద్ధరింపఁగనుర్వి
వెలసె సత్యసాయిపేర వినుము॥

అరయఁగ శ్రీహరి సర్వగుండనెడి ప్రహ్లాదోక్తి రూపింప ము
న్నరసింహంబు సగంబు మానిసియునై నా నారసింహుండె నే
ర్పరియై రూపవికారముఁ బోరయకే భక్తాళినేలంగ నీ
నరసింహుండయి యెందునే నెపుడునేన్ భాసిల్లి నేఁడిమ్మహిన్॥

మట్టుఁదొలంగి రూపమును మార్చియు దానముఁబట్టియున్ బలిన్
మట్టుచు మున్ను విశ్వము సమస్తము నింతినవామనుండె, తాఁ
బెట్టుటెగానికై కొనక వేషముమార్చక గట్టువాట కీ
జెట్టెడుబ్రహ్మచారిగ వశీకృతలోకుఁడెసఁగె నేఁడిలన్॥

సాజమైచను బ్రాహ్మణోచితశాంతిముఁగావిడి, క్షత్రమౌ
రాజసావ మహోగ్రుఁడౌ భృగురాముఁడిప్పుడు హాయిగా
నైజరాజసభీకరాధ్వమునన్ జరింపక బ్రాహ్మమౌ
తేజమూని యనుగ్రహింపఁగఁ దేజరిల్లెఁబ్రశాంతుఁడై॥

మూర్తిఁదాల్చిన యాదర్శవర్తనుండు
జగతికెప్పటికిన్ రామచంద్రమూర్తి
తనప్రవర్తన నిత్యసత్యమ్మటంచు
నడచి చూపించె సాయిరాముఁడుగ నిపుడు॥

హాలమున యమునన్ దనమో
సలకీడ్చినసీరపాణి, జగమెల్ల నిజాం
ఘ్రులకడ కిపుడు సంక
ల్పలవంబున లాఁగువర్తిబాడగ వెలసెన్॥

దయకు మించిన ధర్మమేదియును లేదు
ప్రాణిహింసకు మిన్న పాపమును సున్న
ఆత్మదర్శన సాధ్యమౌనది' యటంచుఁ
జల్పి బోధించు బుద్ధుఁడీసాయివేల్పు॥

సత్యఖడ్గంబూని సర్వదురాచార
శత్రువారముఁద్రుంచుసాయి కల్కి
ధర్మసైంధవమెక్కి ధరణీతలంబెల్ల
సంచారమొనరించుసాయి కల్కి॥
ప్రేమాస్త్రమున్వైచి విశ్వదిగ్విజయంబు
సాధించి రహియించు సాయి కల్కి॥
శాంతివర్మముందాల్చి శత్రుదుర్భేద్యుఁడై
సంచలింపకనిల్చు సాయి కల్కి॥

కలుషవిలయంబుఁగావింపఁగలిగినట్టి
ధర్మసంస్థాపనము సేయఁదరలినట్టి
సత్యసాయీశుఁడనఁగ నెసంగుదిట్ట
కల్కిదేవున కిదె నమస్కారశతము॥

ఆబాల్యముగ లీల లాబాలముగఁజూపు
నాదివ్యమాధుర్య మదియె యిదియు
శరణన్నయాపన్ను సర్వథా రక్షించు
నాశ్రితావనదీక్ష యదియె యిదియు
విర్ణిద్రకార్యమై నిర్లిప్తచిత్తమౌ
నానందఘనధామ మదియె యిదియు
అజహరాదులకైన నంతుపట్టఁగరాని
యాప్రవర్తనతత్త్వమదియె యిదియు
నాఁడుగేస్త్రయ్యె వేలకన్యల గ్రహించి
కలిని వటువయ్యునేఁడు జగత్కుటుంబి
నాఁటికృష్ణావతార మీపాటి మాటి
సాయికృష్ణావతారమై జగతి వెలిఁగె॥

సర్వదైవతరూప సత్యసాయీశావ
తారమూలాధారతత్త్వ మొకటె
సృష్టి పుష్టి వినష్టి సేయు ముమ్మూర్తుల
వెలయఁజేసినతొలినెలవు నొకటె,
నానావిధానంత నామరూప జగత్తు

కాది మూలంబు పునాది యొకటై,
ఆబ్రహ్మ: టం బజాండకోటుల కంబ
యా మహామాయకుఁ ణాధామ మొకటై,
దేశకాలాద్యతీత సందీప్తి నెసఁగి
‘యస్తి భాతి ప్రియ’ మ్మగు వస్తు వొకటై
మసకుఁగా సాయిరూపనామముల గొనిన
యద్వితీయము బ్రహ్మంబు నాశ్రయింతు॥

నిత్యశాంతినివాస నిఖిలదివ్యవిలాస
ప్రత్యక్షపరమాత్మ శరణు
సత్యసాయీశ్వరా శరణు॥

రామశర్మ



# జన్మదినోత్సవము

దేహమే ప్రధానం దేహికాదని భావించుట మానవుని ప్రథమ అజ్ఞానసూత్రం. అలలులేక సముద్రముండవచ్చును; అయితే, సముద్రములేక అలలువుండవు. దేహనిమిత్తము ఆత్మ రాలేదు; ఆత్మనిమిత్తమే దేహము ప్రాప్తమయినది. దీనిని మానవులు విస్మరించుట వారు చేసే రెండవ పొరపాటు.

ఆత్మ నిర్వికారము; షడ్వికారములన్నియూ దేహమునకే. జన్మించినవ్యక్తి ఒకడే అయిననూ నీటిపై పడిన నూనెబిందువలె. ఆ వ్యక్తి యేకాకిగా జీవించుట కంగీకరించటములేదు. తనసంతోషమునకూ ఇతరులసంతోషమునకూ చేరిక (Link) వుంచే వుంటుంది. నేను అనే స్థానమునుంచి మనము అనే స్థానమునకు ప్రయాణముచేయునదే ఉత్తమజీవితము. గత్యము అగత్యము విధి విధానము వీటిని సద్బుద్ధియొక్క ప్రకాశనశక్తిద్వారా తెలిసుకొని అట్టి వికాసమునకు మానవుడు పూనుకోవలెను. మానవుని సుఖశాంతి సౌభాగ్యములన్నియూ, లోకకల్యాణముకూడ, వాని బుద్ధిలోనే ఆధారపడియున్నవి. మానవుడు గాయత్రీమంత్ర

ముద్వారా ధీశక్తిని ప్రచోదించి బుద్ధిని పరిశుద్ధముచేసి అభివృద్ధి పరచుకొరకే చైతన్య స్వరూపుడైన పరమాత్ముని ప్రార్థించు చున్నాడు. వేరేమీ కోరనక్కరలేదు; బుద్ధి నిర్మల నిశ్చల నిఃస్వార్థమయితే అన్నియూ దొరకినట్లే.

మానవుని బుద్ధిని గతజన్మలసంస్కృతి, ప్రారబ్ధబలము, అతని భవిష్యత్తు ఇవి మూడూచేరి రూపొందించును. స్వార్థము నకై బుద్ధి వినియోగింపబడిన, మోహాపేక్ష పెరుగును; పరార్థము కొరకు వినయోగింపబడిన, మోక్షాపేక్ష పెరుగును. తనతోపాటు అందరికీ మోహక్షయమును ఆశించాలి; మనస్సు ప్రాణము చిత్తము ఆత్మ ఈ క్షేత్రములను బుద్ధితో పరిశీలించి పరిశుద్ధపర చుటకు పూనుకోవలెను. ప్రేమను దానము చేయాలి, అహంకా రమును త్యాగముచేయాలి, సమాజసేవలో శౌర్యమును ప్రకటిం చాలి, దయాస్వరూపమైన హృదయముతో సమాజమున ఐక్యతా భావమును స్థిరపరచాలి, అందరిలోనూ ప్రకాశించుచున్న ఆత్మ తత్వమును సందర్శించి సంతోషించాలి.

శరీరధారియైన ప్రతివ్యక్తి అవతారస్వరూపుడే! అయితే, రామ కృష్ణ బుద్ధ క్రీస్తు వీళ్ల ఘనత యేమిటి? మీకూ ఆ అవతార ములకూవున్న భేదమొక్కటే, మరపు, యెరుపు. మానవులకు ఆత్మస్మృతిలేదు, మాధవునికి సదా సర్వత్ర ఆ యెరుపు వున్నది. దానివలననే, ఆ ప్రకాశము, ఆ ప్రతిభ, ఆ పరాక్రమము, ఆ సర్వశక్తి. అవతారములు దేశకాలహేత్వాదులకతీతము, జాగ్రత్ స్వప్న సుషుప్త్యాదులకతీతము, సత్వ రజ స్తమో గుణముల

కతీతము. మానవులకు సుషుప్తిలో యే అనుభవమూ యే ఆనందమూ గోచరించవు. స్వప్నములోని అనుభవము వారికి సుషుప్తిలో లేవు; జాగృతిలోని అనుభవము ఆనందము సుఖ దుఃఖములు స్వప్నములో లేవు. అన్నీ అనిత్యమే, అసత్యమే: అయితే, అవతారములకు ఈ అవస్థాత్రయములు లేవు. అవతారములు సచ్చిదానందస్వరూపులు.

జీవితముయొక్క నిజస్వరూపమును తెలుసుకొని, ఆ తెలివికి తగురీతిగా ప్రవర్తించువాడే బుద్ధిమంతుడు.

**Life is a Challenge;**
**meet it!**

**Life is Love;**
**enjoy it!**

**Life is a dream;**
**realise it!**

**Life is a game;**
**play it!**

ఇట్లు జీవించి జీవితమును కొనసాగించటమే, సరైన దిగ్విజయము. అరణ్యములో సింహము నిర్భయముగా సంచరించి విజయము నార్జించురీతి, మానవుడు ధీరుడై నిర్భీతుడై ఆత్మసామ్రాజ్యమునకు అభిషిక్తుడు కావలెను. సింహగర్జనమును శ్రవణముచేసిన తక్షణమే మృగములంతా దూరమునకు పరుగిడును, అట్లనే,

ఆత్మతత్వ ప్రకాశము అంతఃకరణమును వెలిగించిన తక్షణమే ప్రకృతి సంబంధమైన భయ భ్రాంతులు అదృశ్యమగును.

ప్రచండ మారుతమువలె కాలము కదలి పోవుచున్నది: జీవిత ప్రమాణము మంచుగడ్డవలె కరగి పోవుచున్నది. అయిననూ, జీవితముయొక్క సత్యమును సార్థకతను మానవుడు గుర్తించటము జరుగలేదు. అసతోమాసద్గమయ తమసోమాజ్యోతిర్గమయ. మృత్యోర్మా అమృతంగమయ. అని నోటితోకోరుచున్నాడే కానీ, ఆ ప్రార్థనయొక్క ఫలితమును ఏమాత్రం సాధించినాడు, దానివలన యెంత సంతృప్తి కలిగినది. అని పరికించిన, అందరికీ నిరాశనే కలుగును.

అవతార పురుషుల జన్మ దినములందు వారిని ప్రత్యేకించి ఆరాధించిన ఫలితముండదు. ఆ పవిత్ర పురుషుల వాక్య రత్నములను హృదయములలో దాచికొని ఆచరణలో అందుకొని ఆనందించినవుడే ఆ ఆరాధన సార్థకమగును. భౌతిక ఆడంబరములు ఆర్భాటములు కేవలము వ్యర్థమే, నిరర్థకమే. ఇకపైన మీమీ గృహములలో జన్మదినమును జరుపుకొని, హృదయాలలో ఆదర్శాలను భద్రపరచుకొని ఆచరించండి. అంతే చాలు. ఆధ్యాత్మిక బీజమును హృదయమందు నాటుకొని ఆనంద ఫలమును ఆరగించండి అంతేచాలు. నిరాశకు గురికాక, అశాంతికి చోటివ్వక సంస్థలపెద్దలు ఆచరణరూపమైన ప్రబోధ ప్రచరణలద్వారా ఆనందాభివృద్ధిచేసి అనుభూతుల నందించండి.

పరోక్షవిషయం: నేను మీకందించే వాక్యములనూ సూక్తులనూ నేనే ఆచరించి బోధించుచున్నాను. నా Life ఏ నా Message. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అతిధిదేవోభవ, అని నేను బోధించుచున్నాను కదా? ఆసూక్తుల ఆచరణనే నాకు ఆనందము, తృప్తి. ఇపుడు నేను మాతాపిత్రుల సమాధికి వెళ్లి, తగురీతిగా గౌరవించి, తరువాత, ప్రశాంతి మందిరముపై ప్రశాంతిపతాకమ యెగురవేయుచున్నాను. అయితే మీరు ప్రతిహృదయమునూ ప్రశాంతిమందిరముగా మార్చుకొని, దానిపై ఆ పతాకను యెగురవేసుకోవలెను. అపుడే మీకు ప్రశాంతి, శాశ్వతానందము.

(శ్రీవారి దివ్యోపన్యాసము.) 23-11-72

అఖిల లోక స్వరూప మీ అయిదడుగుల
రూపునందెట్టు లిమిడించితో పునీత
సుంత బిగిపిన బట్ట రవంతసేపు
వంటిపై నున్న ప్రాణముల్ వదలిపోరు

# తెరవమని వారే తట్టుదురు

పిన్నెర్‌లో ఒకయింటిముందు మాకారు ఆగినది. "ఓమ్ సాయి" పేరున్నబోర్డు మమ్ములను స్వాగతించింది: కాలింగ్ బెల్ ఒత్తినవెంటనే ఒకపెద్దామె తలుపుతెరచి "లోనికి రండి మణియన్‌గారు, రండి లలితాగారు" అంటూ ఆప్యాయంగా స్వాగతం చెప్పగా తివాచీలుపరచి కళాత్మకంగా అలంకరింప బడిన డ్రాయింగ్ రూములోనికి ప్రవేశించాము.

అగరుధూమంగాలిలో అంతటా ఆలముకొంది. కొన్ని నిమిషాలలో గృహ యజమాని మెట్లుదిగివచ్చి స్నేహపూర్వకమైన స్వరంతో చిరునవ్వుతో వికసించినమోముతో "రండి రండి" అంటూ మమ్ములను ఆహ్వానించే ఆయనను సీతారాంగారుగా తెలిసికొన్నాము. "ఎన్నో సంవత్సరాలనుండి ఎంతోప్రేమతో మీ కోసం ఎదురుచూస్తూన్నాము. యిది శ్రీసాయిబాబావారియిల్లు. వారికొరకై ఒకప్రత్యేకమైన గదికూడా వున్నదిక్కడ పైకిరండి చూద్దురుగాని:' అంటూ పైకి ఆహ్వానించారు.

మెట్లెక్కి పైకివెళ్లి అక్కడ నయనానందకరంగా అలంకరింపబడిన శ్రీసత్యసాయిబాబావారి ఫోటో చూశాము. చూసినవెంటనే గుండెఝల్లుమనగా పరవశించిపోయాము.

"యిక్కడికి వారు వచ్చారా ?" అడిగాను. మిసెస్ సీతారాం పూజగదిలోనికివస్తూ "వచ్చారా, అంటారేమిటి: మేమెప్పు

్రైన సంధ్యాహారతి యే కొన్ని నిమిషములు ఆలస్యంచేసినా తక్షణమె హెచ్చరికగా, స్వామి తలుపు తట్టడం జరుగుతూ వుంటుంది'' మేము ఆమెవైపు ఆశ్చర్యపూర్వకంగా చూచాము.

''అవును! మేము ప్రతిసాయంకాలం గం-6-30 లకు హారతి నిచ్చే నియమం. దురదృష్టవశాత్తు ఏకారణంవల్లనైనా మేము నియమ భంగము చేసినట్లయితే పూజగదితలుపు తట్టడం ద్వారా బాబా మాకు జ్ఞప్తిచేస్తారు. పూజగదిలో ఎవరూకనబడరు. అప్పుడు మాతప్పుతెలిసికొని ''సాయిక్రిష్ణా క్షమింపుము'' అంటూ పాటపాడుతూ హారతియిస్తాం, ఏం యిదంతా మీకు నమ్మటం కష్టంగావుందా? యెందుకు? ''మీవల్లకాదా స్వామిమాకు లభించారు? ''నావల్లనా? అదెట్లా? ఎపుడు? ''అనిఎంతో ఆశ్చర్యపోతూ అడిగాను. అప్పుడు సీతారాంగారన్నారు.

''మా జీవితములు పండి సార్ధకము కావటానికి. శ్రీవారు మా హృదయాల్లో ప్రవేశించటానికి. వీలుగా మా కళ్ళను మీరే తెరిచారు. మా యింట్లో ప్రతివారమూ భజనజరుగుతుంది. అప్పుడు జరిగే అద్భుతమైన వారిమహిమలు ఇక్కడచేరిన వారికి భగవంతునిలో నమ్మకం కలుగజేసి, వారి హృదయములలో ప్రేమను అభివృద్ధిచేస్తుంది. వకామెతన ఫోటో ఎదుటనిలచి మీరుఅనుమతించినయెడల యీమనిషిని నేను వివాహము చేసికొన గలదానను కాబట్టి నీ ఫోటో నుండి ఆ పూవును నాదోసిలిలో అనుగ్రహించుము. మీ అనుమతినిమ్ము ప్రభూ! అంటే స్వామి అట్లనే ఆపుష్పమునే అందించిరి. ప్రార్థించినవారికి ప్రత్యక్షనిదర్శనములు నిత్యమూ

జరుగుతూనే వుంటుంది. నిజానికి యిండియాలో వున్నంత కాలమూ వారిని గురించి నాకేమీ తెలియనే తెలియదు: యిక్కడికి వచ్చినతరువాతనే మీరు తెలిపిరి: యిదే పెద్దఅద్భుతంకదా?''

''నాదొక చిన్న సందేహం.'' అంటూ ''బాబావారిని మీకు నేను తెలుపుట యేమిటి?.'' అప్పుడు సీతారాంగారు యిట్లా వివరించారు ''కొన్ని సంవత్సరాల క్రిందట మీరు ఆనందవికటన్ పత్రికలో తమిళభాషలోని 'సత్యం శివం సుందరం' అనే గ్రంథముపై సమీక్ష ప్రకటించటం జరిగింది. అది నన్ను వారి పాద పద్మములసన్నిధికి ఆకర్షించింది: అందులకే యిప్పుడు మీకు మా కృతజ్ఞతాభివందనములు తెలియ జేస్తున్నాము''

''అయితే యింతవరకూ వారిని నేను చూడనే లేదే:'' అని యెంతో ఖేదముతో అన్నాను. ''ఇంటియా వెళ్ళగానే సాధ్యమైనంత త్వరలో దర్శనముచేసుకోండి.'' అన్నారు సీతారాం గారు. దయాపూర్వకంగా.

భోజన సమయంలో స్వామి దివ్యత్వమును వ్యక్తపరచే అనేక సంఘటనలను మాకు తెలిపిరి. బ్రిటనులోనూ యింకా అనేకచోట్ల స్వామి తమమహిమా వైభవములను ఎట్లా వ్యక్తప రచుచున్నారు అని తెలియ జెప్పేటప్పుడు, మేము ఎంతో ఆశ్చర్య పరవశులమయ్యాము.

తిరిగి లండన్ వచ్చాము, అదేకారులో; ఎందుకో హృదయం ఆనందంతోనూ ఆతృతతోనూ సుడులు తిరిగి పోతోంది.

''సార్! 'ఓం సాయి' ఆయనయొక్క పేరా!'' అని అడుగుతూ డ్రైవరు జాక్, నా ఆలోచనా ప్రవాహానికి అడ్డు తగిలాడు. ''అది ఆయన దేవుడు! ''అంటూ శ్రీ సత్యసాయి బాబా వారిని గురించీ వారి దివ్యావతారమును గురించీ వారి అద్భుత లీలా విభూతులగురించీ సీతారాంగారు మాకుతెలియ జెప్పిన వివరములన్నీ వానికి వినిపించాను అంతా విన్న తరు వాత జాక్ ''ఆహా యిండియా ఎంత అద్భుతమైన దేశం అదొక పుణ్యభూమి! అనంతమైన సత్యాన్ని కనుగొని మీ పూర్వులు ఆ నిక్షేపాన్ని భద్రంగా మీకోసం పదిలపరచివుంచారు మీరీనాడు 'అభ్యుదయము' పురోగతి 'వికాసమూ అంటూ ఏండ మావుల్లాంటి మనఆశయాలకోసం పరిగెడుతూ ఆ నిక్షేపాన్ని త్రోసిపుచ్చకండి. మానవజాతి కోసరం చెబుతున్నాను. యెంత విలువైన వుపదేశము! దాన్ని త్రోసిపుచ్చకండి అన్నాడు విమానాశ్రయంలో పారిస్ వెళ్ళే విమానం ఎక్కుతూ మేము అతనినుండి సెలవు తీసికొన్నాము.

మణియన్‌గారి వ్యాసమాల 'హృదయప్రబోధ'' నుండి

# సబ్ కో సన్మతి



మానవుడు సుఖమునే ఆశించి దాన్ని పొందవలెనని జీవితమంత పరుగెడుతాడు. అయితే, సుఖము ఇట్టిది అట్టిది అనే నిశ్చయబుద్ధి లేక, ఏది లభించినా దానికన్న ఇంకొకటి ఎక్కువ సుఖమునందించును అనే భ్రాంతిలో పడిపోవుచున్నాడు. బాహ్యపదార్థములనే బాహ్యవిషయములనే ఆశ్రయించి తద్వారా నిరాశకూ అశాంతికీ గురియైపోతున్నాడు. లోతుగా విచారణ జరిపిన, సుఖములకంత్యమెక్కడ? బాహ్యవస్తువులు అందించే సంతృప్తి యెట్టిది? పుట్టిన తక్షణమునుంచి గిట్టేక్షణమువరకూ సుఖము సుఖము అని దానివెంట తిరిగి పరుగెడుతూ కాయమును కాలమును దాని కొరకు అంకితము చేసే మానవుడు తాను ఆనందస్వరూపుడు అమృతస్వరూపుడు మధురస్వరూపుడు అనే నిజమును మరచి బాధపడుచున్నాడు, అంతే!

సుఖశాంతులు దేహనిమిత్తమా, ఇంద్రియములనిమిత్తమా మనస్తృప్తినిమిత్తమా అనే ప్రశ్నలనటుంచి, అసలు తాను దేహమా ఇంద్రియమా మనసా లేక వీటికతీతమైన ఆత్మనా అనే విచారణను మానవుడు మొట్టమొదట సలుపాలి. దేహమనేది ఒక ఘటము మాత్రమే. జాతి కులము మతము రూపము

నామము ఇవన్నియునూ ఆఘటమునకు సంబంధించినవే కానీ ఆకాశమువలె సర్వవ్యాపియై నిర్గుణ నిరాకారమై ఆఘటములో దాచియున్న ఆత్మకు అంటునవికాదు.

తాను జడమైన స్థూలశరీరము కాదు: ఆ ఘటములోని జలము తానుకాదు: అంటే కామక్రోధాదులు, ద్వైతభావములు మొదలైన వికారములు. సూక్ష్మశరీరముకూడ తానుకాదు. కారణ స్వరూపుడు కూడ, తానుకాదు. తాను నిరాకారుడు. క్షణికమైన అశాశ్వతమైన ఆకారముతో నామముతో బంధమున్నట్టుగా నటించే వాడు, అంతే. మృణ్మయమై భాసమయ్యే ఈ జడము, ప్రాపంచికము; చిన్మయమైన దానిలోని నిజతత్వము ఆధ్యాత్మికము. అయితే, ఒక విషయమును గట్టిగా మనసుకు తీసుకోవాలి. పాత్రయందు మట్టియుంది కానీ మట్టిలో పాత్రలేదు. దేహమందు ఆత్మవున్నది కానీ ఆత్మలో దేహము లేదు. పాత్రము కల్పితము అనిత్యము, అసత్యము. ఆత్మ నిత్యము, సత్యము. కాబట్టి, మానవుడు సర్వాధారమైన ఆత్మను తెలుసుకోవలెను.

తెలివి అంటే, దానిలో మూడు విధములున్నవి—జ్ఞానము సుజ్ఞానము, విజ్ఞానము. ఇంద్రియాలద్వారా. గ్రంథములద్వారా, ఇతరులద్వారా ప్రపంచముయొక్క స్వరూప లక్షణాలను తెలుసు

కొనేది, జ్ఞానము. తనకు కాని పరులకు కాని అపకారము దుఃఖము బాధ అలజడి కీడు యేమి కలిగించక విచారణా శక్తిని వినియోగించుకొనేది సుజ్ఞానము. శుద్ధాంతఃకరణమును సంపాదించుకొని, దానిద్వారా సత్యము అహింస సహనము మొదలైన దైవీగుణములను పెంపొందించుకొనిన తరువాత, వాని ఆత్మస్థానమునుంచి బయలుదేరే ఊహలంతా విజ్ఞానమే.

మానవత్వము సదసద్ మిశ్రమైనది, దేహము అసత్; ఆత్మ, సత్. మనసత్యము ఆ పరమాత్మలో లీనమైనపుడు, సత్యస్య సత్యము గోచరమగును. దీనికి చేయుప్రయత్నమే జీవితముయొక్క ప్రధానకర్తవ్యము, అదే విజ్ఞాన సంపాదన.

పాశ్చాత్యుల దృష్టిలో విజ్ఞానమంటే ఇది కాదు; బుద్ధిశక్తిని పురస్కరించుకొని మానవులు కొన్ని నిర్ణయాలను అనుమోదించుచున్నారే, వాటిని వారు విజ్ఞానమంటున్నారు: భారతీయ విజ్ఞానము యెవరికీ హానిసందించదు. ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి అనే ఏకాలభావమును ప్రేమతత్వమును అహింసా సందేశమును ప్రబోధించేది, భారతీయ విజ్ఞానము. తనకూ పరులకూ ఏకాంత అపకారములేక, జనులను శాంతపరచి ఆనందపరచేదాన్ని భారతీయులు విజ్ఞానము, అంటారు: జ్ఞానమునకుగాని సుజ్ఞానమునకుగాని విజ్ఞానమునకుగాని బుద్ధి మూలాధారముగా వెలుగుచున్నది. బుద్ధి సుప్రీం కోర్టు; ఆ కోర్టు చేయు తీర్పుకు అడ్డులేదు. దీన్ని పురస్కరించుకొని గాంధీగారు కూడ, "సబ్‌కో సన్మతి దే భగవాన్!" అని తాను ప్రార్థించి

ఆ ప్రార్థనను అందరి నోటిలోనుంచి వలుకరించినారు. సన్మతి లభించిన, సర్వకర్మలనూ దానితో పరీక్షించి ఏది ఉత్తమము ఏది అధమము అని నిర్ణయము చేయవచ్చును. భగవత్ శక్తిని ఆశ్రయించకానేదే విదేశీయుల బానిసతనమునుంచి విడుదలపొందే వుపాయమని తలంచి, అందరికీ పవిత్రమైన సన్‌న్మతి దొరకని, అని గాంధిజీ వేడుకొన్నాడు.

భారతీయ ఆధ్యాత్మిక పద్ధతిలో దేహమునకు విలువఉన్నది; దానిని హింపించవలెను త్యజించవలెను అని యెవరూ వుపదేశించరు. దానికి అసహించకూడదనే భారత సంస్కృతియొక్క సందేశము. దేహము దేవమందిరము: సదాచారము సత్సంగము సత్కర్మలు వీటికంతా దేహము అత్యవసరము. దేవుణ్ణి సందర్శించుకోవటానికి దేహముండియే తీరాలి. భ్రమించే మనస్సు చలించే బుద్ధి రెండూ లేక, సాక్షాత్కారమనే దీక్షను పట్టి దానిని సాధించు కోవాలి.

దేవకార్యమును చేపట్టిన తరువాత సుఖముకానీ దుఃఖముకానీ యేది అడ్డువచ్చిననూ లెక్కచేయకూడదు. హనుమంతుడు రామాజ్ఞను శిరసావహించి నిద్రాహారములనుమాని సీతాదేవిని శోధించినాడు; అన్ని ప్రదేశములనూ చాలించినాడు. సాగర

మును దాటి గగనమార్గమున లంకాద్వీపమునకు ప్రయాణమైనాడు మార్గమధ్యమున మైనాకపర్వతము సముద్రమునుంచి లేచి పైకి వచ్చి, ''హనుమంతా! చాలా అలసిపోయినావు. కొంతసేపు విశ్రాంతి తీసుకొని, పర్వతాగ్రములోని వన్యఫలములనారగించి తరువాత, మీ ప్రయాణమును కొనసాగించు'' అని వినయ విధేయతలతో వేడుకొన్నది.

ఆయితే హనుమంతుడు నేను రామకార్యమై వెళ్ళుచున్నాను! నాకు విశ్రాంతి అక్కరలేదు; ఆజ్ఞను సాధించే వరకు నాకు నిద్రాహారములతో పనిలేదు, అని ఆమె కోరికను నిరాకరించినాడు. చూడండి! మైనాకము కొండజాతి! అయిననూ ఆ సేవా బుద్ధి ఆ దయార్ద్ర హృదయము ఆ వినయ విశ్వాసములు ఆ చల్లని పలుకు ఆ రామభక్తి యెంతగొప్ప! యెంతపరిశుద్ధము! హనుమంతుడా? కోతిజాతి! అయిననూ స్వామిఆజ్ఞపై యెంత భయము భక్తి విశ్వాసము! యెంతవిష్ఠ! యెంత యేకాగ్రత! మనకు జాతికాదు ముఖ్యము; నీతి ముఖ్యము ఆ నీతివలననే విజయప్రాప్తి కొండ; కోతి, వీటికంటే వివేకమూ విజ్ఞానమూ మానవులమైన మనకు లేవి యెడల సిగ్గుపడాలి! దీనులను చూచి జాలికలిగి వారికి సాయపడి సేవచేయవలేననేది మైనాకపర్వతముయొక్క బోధ. మాధవత్వమును పొందవలెనన్న మాధవుని ఆజ్ఞలనను సరించి వర్తించవలెననేది హనుమంతునిబోధ.

* * * * * *

ఈ గుణముల నభివృద్ధిచేయుటదే ఆధ్యాత్మికమార్గము

త్రాడు స్వరూపమును పాముగా తలంచి భయభ్రాంతులకు వశమై బాధపడే స్వభావమునకు సిగ్గుపడి ఆధ్యాత్మిక మార్గముయొక్క అంతిమ గురి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని తెలుసుకొనేది దాని ఫలితము. దారములేని వస్త్రములేదు; బంగారములేని నగలేదు మట్టిలేని కుండవుండదు; బ్రహ్మములేని జగత్తుండదు. బ్రహ్మ మయమైన కాయము బ్రహ్మమయమైన ప్రకృతియందు బ్రహ్మ మయమై పోవటమే ప్రధాన కార్యము. ఇట్టిపవిత్ర జ్ఞానమును వికసింప జేసే ప్రయత్నము సలుపటమే ఉచితమార్గము, ఉత్తమ మార్గము.

కోహం కోహం యేడ్పుతో మానవుడు పుట్టుచున్నాడు అపుడు బంధుమిత్రులు సంతోషముగా నవ్వటానికి ప్రారంభింతురు. పెద్దలకునవ్వు; పుట్టిన బిడ్డకు ఏడ్పు; పెద్దలకు లోక వాంఛ; లోకవాంఛలు తెలియని పిల్లవానికి దేవవాంఛ; జనన ముహూర్తమున ఇట్లయితే, అంత్యముహూర్తమందు వాంఛా రహితుడై నిర్మల హృదయముతో సోహం అనే సమాధానముతో జ్ఞానప్రకాశముతో ప్రాణమును విడువ వలెను. భక్తులు ప్రశాంతముగా ఆనందముగా ఆ సమయమున నవ్వుతూఉంటే, బంధుమిత్రులు తమకు లోటు కలిగినదే అని ఏడ్వమొదలిడుదురు. కనుక దేహము పవిత్ర కర్మలనిమిత్తమై ప్రాప్తించినది అని తెలుసుకోవలెను. మనోబుద్ధులను ఉత్తమ మార్గమున వికసింప జేసి

ఆత్మను పరమాత్మునిలో లీనమొనర్చి జీవితమును సార్థకము గావించుకొనవలెను.

స్థూల శరీరముతో సత్కర్మల నాచరించి, సూక్ష్మశరీర ముతో సచ్చింతల నభివృద్ధిజేసుకొని, కారణ శరీరముతో ఆత్మ సామ్రాజ్యమును జయించి సాక్షాత్కారము పొందవలెను.

శ్రీ వారి దివ్యబోధ 23-11-72

## పిల్లలు—పెద్దలు

వ్యక్తులద్వారా సమాజముయొక్క పురోగతిని సాధించు మార్గమే భారతసంస్కృతియొక్క విశిష్టత; సమష్టి స్వభావము సమష్టిస్వరూపము సర్వభూతహితము లోకసంగ్రహము వీటినే భారతీయ ఋషులు ప్రధానముగా వుపదేశించి ఆచరించిరి.

మనుస్మృతి నారదస్మృతి యాజ్ఞవల్క్య స్మృతి మొదలైన స్మృతులు సమష్టి జీవితమును వ్యక్తులద్వారా తీర్చిదిద్దుటకు ప్రధానాధారములైన క్రమశిక్షణలను శాసనముగా విధించినవి. వీటినే శాస్త్రమందురు. ఒక వంగదేశమందుతప్ప మిగిలిన రాష్ట్రముల

ప్రజలంతా మితాక్షరమనే శాస్త్రపద్ధతిలోనే తమ సామాజిక బాధ్యతలను నెరవేర్చుచూవచ్చారు; వంగదేశమందు దాయభాగమనే పరిష్కృత పద్ధతి అమలులో వుండినది. అయితే ఇపుడు కాలమార్పు వలన ఒకొక రాష్ట్రమునకు ప్రత్యేకమైన (లా) శాసనముండవలెననే వాంఛ బయలుదేరినది.

అయితే యెవరేమిచేసిన కర్మజిజ్ఞాస ధర్మజిజ్ఞాస బ్రహ్మ జిజ్ఞాసలో శతశతమాన కాలము మునిగియున్న భారతదేశ మందు ధర్మమే నిండి నిబిడీకృతమై తాండవమాడును. సందేహము లేదు. పరిశుద్ధాంతఃకరణమునుంచి ఆవిర్భవించిన ఉత్తమభావములే మన ధర్మశాస్త్రము.

రతి ప్రాప్తి ఆనందము అనే మూడు ప్రేరణశక్తులు మాన వుని వెంటాడును; వీటిననుసరించి తమోగుణము రజోగుణము సత్వగుణము. సుషుప్తి స్వప్నము జాగ్రిత్ అనే అవస్థలు కూడ. వీటియొక్క నీడగా భయము మహాభయము మృత్యు - కూడ మానవుని అజ్ఞానాంధకారమున కాకర్షించును. ఇచ్ఛాశక్తి క్రియా శక్తి జ్ఞానశక్తి అనే శక్తులుకూడ రతి ప్రాప్తి ఆనందము అనే స్వభావాలకు పోషకముగా దానివలననే భక్తిమార్గము కర్మమార్గము జ్ఞానమార్గము మానవునికి అలవడుచున్నవి.

చిన్న పిల్లలు పూలను పట్టుకొందురు నిప్పునూ పట్టుకొం దురు. వారికి అవి ఆకర్షణ; కానీ వాటిపై అంత బలమైన

వాంఛ లేదు. ప్రాప్తి నిమిత్తమై రతిలేదు. పెద్దలకు ప్రాప్తి సహితమైనదే ఆనందము. బాలోన్మత్త జ్ఞానిపిశాచవతో, అంటారు. చిన్నపిల్లలు పిచ్చివాడు జ్ఞాని పిశాచముపట్టినవాడు, అందరికీ ఇదికావాలి అదికావాలి అని ప్రాప్తికొరకు పట్టుదల లేదు, చిన్న పిల్లల జోబులను, పరీక్షించండి -ఇసుక రాళ్లు గాజుముక్కలు ఇవే దొరకును. దానితోనే అమితానందమననుభవింతురు. పెద్దలకు తమ జోబు నిండ కట్ట కట్టలు నోట్లున్న కూడ అంత ఆనందముండదు. మట్టిలో ఆడేదేవాళ్లకు హాయి, విశ్రాంతి. అయితే, దేహములో మాలిన్యముండిన మనస్సునిర్మలము పెద్దలకు దేహమునిర్మలమయిననూ, మనస్సు మాలిన్యపూరితముగా వుండును.

భోగులు యెపుడూ తక్కువ శ్రమమునకు యెక్కువ ఫలితము నాశింతురు. కాబట్టి వాళ్లకు నిరాశ, అశాంతి: యోగులు శ్రమము అధికమైననూ తక్కువఫలితమునే యెదురు చూచుదురు. కాబట్టి వాళ్లకు ఆనందము, శాంతి. నిర్మమత్వమందే ఆనందము; అదే నిజమైన మానవధర్మము: అదే విముక్తి సాధన. మమత్వము పశులక్షణము; అది రక్తిని పెంచి పెద్ద చేయును. ఆనంద ప్రాప్తికై భగవద్రతిని అభివృద్ధి జేసికొనే వారే ధన్యులు.

నయాపైసా వెలయుండవచ్చు, ఆ కవరుకు, దానిపైన చిన్న పిల్లవాడు వంకరి డింకరిగా అక్షరములను వ్రాసియుండ

వచ్చును. అయనన్నూ, పోస్టుమ్యాన్ ఆ జాబును ఇచ్చిన తక్షణమే తల్లి సర్వ పనులనూ వదలి కండ్లనిండ ఆనందబాష్పములతో, చదివి చాలా సంతోషించును. ఐదు రూపాయల విలువ గల మంచి కవరులో సువర్ణాక్షరమున తుచ్ఛమైన విషయము లను అందముగా ప్రింటు కొట్టి పంపిన కూడ, వానిని ఆ తల్లి చించి వేయును కానీ చదివి ఆనందించదు. తల్లీ కుమా రుల ప్రేమ అటువంటిది.

అట్లనే, దేహముపై రుద్రాక్షమాలలు కంకణములు ధరించి, జటలను పెంచి, ఆడంబర వేషముతో ఆర్భాటము చేసికొని వేదశాస్త్ర పురాణేతిహాసములలోని శ్లోకాలను పలుకరించిన అవన్నీ కవర్లుమాత్రమే; లోపల జాబులోని విషయ వివరాలు తుచ్ఛమై నవా, ఉత్తమమైనవా? ప్రేమపూరితమైనవా రాగద్వేషయులతో కలు షిత మైనవా అని లోకమాత పరీక్షించును. ఉత్తమ భావా లతో నిండిన జీవితమైతే, ఆనందపడును. అవి లేనిచోట చీ చీ అని అసహ్య పడును. యెన్ని విద్యలు నేర్చిన, పద వులు యేలిన, ప్రతిష్ఠలు పొందిన, తన దేహమాతను ఆ లోక మాతనూ ఆనందింపక, కృతజ్ఞతను అందించక, స్వల్ప విషయా నికే ఉప్పొంగిపోయె ఆ తల్లులను ప్రీతించక, వాళ్లను సం తృప్తిపరచక, జీవించిన, ఆ జీవితము వ్యర్థమే, సందేహము లేదు.

శ్రీవారి దివ్య బోధనుంచి **24-11-72**



# శిష్ట పోషణ

మానవుని కనులకు కప్పిన పొరలను తొలగించే సద్గురు; మన స్వామి. అజ్ఞానమనేవ్యాధితో అభివృద్ధిచెందిన మోహమే ఆ పొర. సత్యస్వరూపమును మనకు దర్శింపజేసి విశ్వమునే దేహముగా ధరించిన స్వామి వారి నిజత్వమును తెలుపుదురు.

Sai Path, అంటే సాయిమార్గములో జీవులను ప్రవేశపెట్టి నడిపించి వారు సంసారసాగరమును తరింపజేయుదురు మొట్టమొదట వాత్సల్యముతో బుజ్జగించి ప్రేమతో ఆకర్షించి యోగ్యమైన కోర్కెలను తీర్చుచూ అన్నవస్త్రదాయకుడై ఆపద్బాంధవుడై అహేతుక కృపాసింధువై సుఖసంతోషములను సమకూర్చి మనలను తమ దివ్య ప్రభావమునకు వశము చేయుదురు.

తరువాత మనలో లోతుగా పాతుకునిపోయిన దురలవాటులన్నిటినీ ప్రేమమాత్రముతోనే అంతము చేయుదురు. సత్ సంగము, సత్ చింతన, సత్కార్యములు వీటిలోనుంచి మన నీతి నిజాయితీలను పరిశుద్ధ పరచుదురు. మానవజన్మము ప్రాప్తించినందుకు మనముచేయవలసిన పని ఏమి, చేరవలసిన స్థానమేమి అని ప్రబోధించి సాధనలు క్రమశిక్షణ, సేవాకైంకర్యములు వీటిద్వారా వారి సన్నిధిని అనుగ్రహింతురు.

మానవసేవనే మాధవసేవ: అందరిలోనూ సాయి ఉన్నాడు కాబట్టి యెవరినీ తూలనాడవద్దు. నిందించవద్దు; యెవరికి బాధ కలిగించినా యెవరినిహింసచేసిన సాయికి కలిగించినట్టే సాయిని హింసించినట్టే అని హెచ్చరించి అనుభూతులతో ఋజుచేసి ఈశ్వర స్సర్వ భూతానాం....అనే సత్యమును తేటతెల్లముగా వుపదేశింతురు. నాజీవితమే నాసందేశము' అంటూ వారి నిర్మల నిశ్చల నిస్వార్థచర్యలనూ కర్మలనూ మహిమలనూ ప్రత్యక్షముగా అవలోకించు అవకాశమును కలుగజేయుదురు మనము యెక్కడ ఉండిననూసరే, సప్తసాగరముల అవతల ఒడ్డున వుండిననూ సరే।

ఇక మూడవ స్టేజి: బంగారమును అగ్గిలోపెట్టి కరగించి శుద్ధపరచిన తరువాత దానిని కొట్టి ముక్కలుచేసి నానాబాధలకు గురిచేసి నగగా తయారుచేయుదురు కదా? అట్లనే. స్వామి కష్ట నష్టములు నిందనిష్ఠూరములు సుఖసంతోషములు వీటితో మన శ్రద్ధా భక్తి విశ్వాసములను దృఢము గావించి దృష్టిని విశాలము చేసి వివేక వైరాగ్యములను బలపరచి, విశ్వమనే ఈ క్రీడాంగణములో మనమందరూ వారి యిష్టప్రకారము ఆడే తోలు బొమ్మలము మాత్రమేనని. వారిచేతిలోని వేణు మాత్రమే అని తెలిపి అట్లు తెలిపికొన్న వాళ్లకు నిత్యానంద పరమానంద అద్వైతానందమునను గ్రహింతురు. ఇదే వారు సంకల్పించి అవతరించియున్న శిష్టపోషణ దుష్టశిక్షణా కార్యక్రమము.

వినాయక

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను చార్జీలను మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోష్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్ పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోష్టుచార్జీ మరియు. ప్రతి ఆర్డరుతోనూ రిజిస్ట్రేషను చార్జీ రూ. 1-05పై జతపరచి, కావలసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| **తెలుగు:—** | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-56 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-21 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11. | గీతాభావ ప్రకాశము | 15-00 | 1-00 |
| 12. | బోధామృతము | 0-50 | 1-00 |

| | | | |
|---|---|---|---|
| 15. | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. | స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |
| 17. | దివ్యజ్ఞానదీపికలు | 0-75 | 0-20 |

కన్నడం:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 3-50 | 4-90 |
| 2. | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. | ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. | ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. | ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | | |
|---|---|---|---|
| 1. | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2. | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. | గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-15 |
| 5. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. | అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. | వాచోరత్నంగళ్ | 3-00 | 0 30 |
| 8. | ధర్మ వాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:-

| | | | |
|---|---|---|---|
| 2. | (2భా) | 4-00 | 0 30 |

| | | | |
|---|---|---|---|
| 3. | .. .. (3భా) | -00 | 0-30 |
| 4. | ,, .. (4భా) | | 0-40 |
| 5. | .. .. (5భా) | | 0-40 |
| 6. | సత్యసాయి స్పీక్స్ (6భా) | | 0-40 |
| 7. | .. .. (7భా) | -00 | 0-65 |
| 8. | సాయిబాబ (అమెరికన్ ఎడిషన్) | | |
| | సత్యం శివం సుందరం (1వభా) | 6-00 | 0-30 |
| | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 10. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 11. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 13. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 14. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 15. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 16. | భజన్ సాంగ్స్ | 2-00 | 0-20 |
| 17. | ధ్యానవాహిని | 2-00 | 0-15 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ భా) | 3-50 | 0-40 |
| 4. | .. .. .. (2వ భా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | ,, ,, | (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | పోయిమాత | | 1-00 | 0-10 |
| 9. | ధర్మ వాహిని | | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణీ | | 2-05 | 0-25 |
| 11. | జ్ఞానవాహిని | | 1-50 | 0-20 |

**హిందీ:——**

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

**బెంగాలి:——**

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యం శివం సుందరం | 4-00 | 0-35 |
| 2. | సందేహ నివారిని | 2-50 | 0-30 |

**గుజరాతి:——**

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కధాసుధ | 2-00 | 0-15 |
| 3. | దర్మ వాహిని | 1-50 | --20 |
| 4. | సత్యం శివం సుందరం | 4-00 | 0-35 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

**మేనేజర్, సనాతన సారథి.**

# గమనిక — పత్రికల చందాలు. పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలతో సనాతన సారథి మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా : 4రు॥ ఒక సంవత్సరమునకు తక్కువకాని 5 సం॥ల కెక్కువకాని చందాలు స్వీకరింపబడవు.

2. చందాలను పంపించునప్పుడే ఈ క్రింది వివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలను పంపేవారు "క్రొత్తచందాదారు", అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడుగించుటకు, తనచందానెంబరునుచందాపంపించు సమయమునందే తెలియజేయవలెను.

సి) తెలుగు పత్రికకావలెనో లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగా వ్రాయవలెను.

డి) చందాదారు తన పేరును పూర్తివిలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను. M.O. ద్వారా చందాను పంపించువారు వారిపేరును పూర్తి విలాసమును M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని పుస్తకములుగాని V. P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. M. O. ద్వారా పైకమును పంపించువారు కూపనులోనేకావలసినపుస్తకముల వివరములను తెలియజేయవలెను.)

4. పత్రికలకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను. "సనాతన సారథి", ప్రశాంతినిలయం పోస్టు. అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు బ్యాంకిఖర్చులనుకూడా కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక. పుస్తకములుగాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5. పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతనసారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా. ఆంధ్రప్రదేశ్ అనుచిరునామాకు వ్రాయవలెను అట్లువ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమచందానెంబరును లేక బుక్ ఆర్డరునెంబరును, తప్పక వ్రాయవలెను, అట్లు వ్రాయనియెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

6. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

---

ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా ప్రశాంతినిలయమున నందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయమందు యన్. కస్తూరి గారిచే ముద్రింపబడి బి.వి.రాజాగోపాలరావుగారిచే శ్రీ సత్యసాయి ట్రస్ట్ తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్, యన్. కస్తూరి ఎం. ఏ. బి. యల్.

